Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.



సంపుటము 19 { 1927 సం॥ ఆగష్టు నెల. } సంచిక 5

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, గుల్బరగా జిల్లా
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, మడికొండ
3 బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాదవరం.
౪ రామసింగు గారు - నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు - నెల్లుట్ల.
౫ శ్రీమద్వెంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, విశాఖపట్టణంజిల్లా.
౨ ఎర్రమిల్లి లక్ష్మీనరసింహాముగారు, మర్చెంటు, బెజవాడ.
3 రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామల్రాజు ప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహరావుగారు, కరణం, మోర్జంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ టి. లక్ష్మణసింగుగారు, జొనగాం
౧౦ నెల్లుట్ల నరసింహారావుగారు, జొనగాం
౧౧ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౨ పేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧3 జాగర్లమూడి కుప్పస్వామినాయుడుగారు, కారంచేడు
౧౪ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౫ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఇంగోలి.
౧౬ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకొండూరు
౧౭ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౮ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
3 సంగెం రామారావుగారు, కుంటుపల్లి.
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావజ్ఝుల రంగయ్యగారు, నర్సారావుపేట
౭ నారాయణరావుగారు, దాతారుపల్లె

# అభినవసరస్వతి

సంపుటము ౧౯ { జా న పా డు / ప్రభవ సం॥ శ్రావణమాసము } సంచిక ౫

# హైందవ ధర్మశాస్త్రములు.

—:o:—




మహాశయులారా!

శ్రీపరమేశ్వరేచ్ఛా ప్రభూతంబగు నీప్రపంచమందు ధర్మార్థకామ మోక్ష రూప చతుర్వర్గఫలప్రాప్తి కాశ్రయంబగు మనుష్యజాతి భూతసర్గంబునకెల్ల నుత్తమంబని యార్యులు వచింతురు. దేవతలకుఁ గర్మాచరణము లేక కేవలఫలానుభవమాత్ర ముండుట పురాణప్రసిద్ధమగుటంజేసి వారికీచతుర్వర్గముతోఁ బనిలేదు. పశు పక్ష్యాదులకు జ్ఞానరాహిత్యమునను నవయవసామగ్రీ వైకల్యమునను వానికిఁగూడఁ జతుర్వర్గసాధనము సమకూరదు. అన్నిటికిని సమర్థమగునది యొక్క మనుష్యజాతి మాత్రమేయని విశదమగుచున్నది. ప్రపథమమున మనుజులుగూడఁ బశుపక్ష్యాదులంబలె ధర్మాచరణము లేక యథేచ్ఛముగఁ బ్రవర్తించియుఁ గాలక్రమమునఁ దమకు భగవత్ప్రసాదితంబగు జ్ఞానంబు బలిమిచేఁ దమప్రపంచయాత్ర కనువగు కొన్ని నిబంధనముల నేర్పాటు చేసికొని, వానిని గ్రంథరూపమున వెలయించి రనియు, నవియే యిప్పుడున్న మనధర్మాది శాస్త్రములనియుఁ జరిత్రములు చెప్పుచున్నవి. వేదములం దీధర్మాది శాస్త్రములకు మూలసూత్రంబు లగపడుచున్నవి. వేదములందున్న మూలసూత్రముల ననుసరించియే మహర్షులు తమ తమ కాలములందుండు జనుల యిష్టానిష్టముల ననుసరించి వేర్వేఱ ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, కామశాస్త్రము, మోక్ష (వేదాంత)

శాస్త్రము ననుశాస్త్రముల విపులముగ రచించిరి. చతుర్వర్గమున నర్థకామములు రెండు నీజన్మంబున నుపకరించును. మోక్షము శరీరావసానమున, ననుభవింపఁబడును. ధర్మమన్ననో యిపుడునపుడుఁగూడ నుపకరించుటయె కాక మిగిలినమూఁడిటికిఁ దానే కారణముకూడ నై యున్నది. ధర్మరహితున కర్థకామము లుండవు. దైవికముగనున్నను రాణింపవు.

అధర్మపరునకు మోక్ష మతిదూరము, ధర్మాత్మున కనపేక్షితములయ్యు నర్థకామములును మోక్షము నవశ్యంభావులని యార్యులందురు. కాన ధర్మమన్నింటికి నుత్తమోత్తమము. ఈయూహముతోడనే మహర్షులు ధర్మశాస్త్రములను పేరుగల గ్రంథములందు విపులముగఁ బురుషార్థచతుష్టయము నుపవర్ణించి యుండిరి. కొందఱు మహారాజులు ధర్మమును నాల్గుపాదములతో నడిపించిరని పురాణములందు వినఁబడుచున్నయది. అందు నాల్గుపాదములనఁ బురుషార్థచతుష్టయ మనిన యర్థము సమంజసముగాఁ దోచుచున్నయది.

ప్రకృత కాలమున రాజకీయ నిబంధనములగు ధర్మశాస్త్రములందుఁ గేవలము నర్థకామముల సంబంధించిన విషయములు మాత్రమగపడుచున్నవి గాని యితరవిషయము లగపడవు. కావుననే వానియందు జనానురాగము భయముననుస్వార్థపరత్వముచేతనే కలుగుచున్నది కాని స్వేచ్ఛాప్రవృత్తముగా లేదు. హైందవ ధర్మశాస్త్రములందన్ననో భయముగాని కేవల సుఖాపేక్షగాని జనాకర్షణ హేతువులుగానేరవు. కావుననే చిరకాలము నుండియు మనధర్మ నిబంధనముల యధికారము రాజకీయముగఁ గాకున్నను నవ్యాహతముగఁ గొందఱు మహనీయుల హృదయసీమలయందాంతరాత్మికముగ రాజిల్లుచున్నది. ఇంతటి యుత్కృష్టములగు మన ధర్మశాస్త్రములందనేకుల కాదరముండకుండుటకుఁ గాలవైపరీత్యము దక్క వేఱొండు కారణ మగపడదనుటవింత కానేరదు.

ప్రకృతమున ధర్మశాస్త్రముల నాదరించు మహానుభావులైన నెంతవఱకు వాని నాచరణమున వినియోగించుచున్నారో చూచెదము గాక. మన ధర్మశాస్త్రమునందుఁ జతుర్వర్గము నిమిడియున్నదని చెప్పి యుంటిని. ఎచ్చటనో కోటికొకరు మోక్షకాంక్షు లుందురు. అర్థకామ ముల ననుభవించువారు ప్రకృత రాజకీయ నిబంధనముల నాలోచిం తురుగాని మన ప్రాంత పుస్తకముల మదిలోనైనఁ దిలకింపరు. కొందఱు మాత్ర మర్థకామములకు సంబంధము లేనట్టియు నించుక మోక్షము నకు సంబంధించినదియు నగు శుష్కధర్మమునం దాచరణము నగపఱ చుచున్నారు.

ఈ లేశమయినను దైవదోషమున మనయాంధ్రదేశమున లేదు. ఇపుడాచరించుచున్నధర్మ మెల్ల వర్ణాశ్రమాచారములకు సంబంధించిన కర్మరూపమై యున్నది. కర్మభూమియగు మన యార్యావర్త దేశమున నీపాటియైన ధర్మము మిగిలియుండుట మదావహమే.

ఈకర్మములలో సైతము కొన్ని పారలౌకికములు కొన్ని యైహిక ములునై యున్నవి. వానిలోఁ బారలౌకికములు యాగాదులు చాలవఱ కస్తమించినవని చెప్పవచ్చును. ఇఁకఁగొన్నిమాత్ర ముపనయనాదులు మిగిలియున్నవి. ఉపనయనాదులుగూడ నదృష్టఫలకములనియే మనలో ననేకులు తలంచుచున్నారు. కొందఱు ఫలవిషయమున నిదమిత్థమను నిర్ణయము లేకయున్నారు. ఇట్టితరి నీభాగముగూడ నంతరించినదని చెప్పనలసినదే కదా? ఏల యుత్తమోత్తమము లనుచు నశేషజనము వర్ణించుచున్నను వాని నాచరింపకున్నారు. ధర్మార్థకామమోక్షముల వలనఁ బారలౌకిక సుఖముకంటె నైహికసుఖమే యధికముగ, లభించు ననునభిప్రాయమును గనుఁగొనకపోవుట వలన! —

ఇఁకఁ బ్రసక్తానుప్రసక్తముగఁ బురుషార్థములవలన నైహిక సుఖ మెంతకలదో విచారింతము. అర్థకామములను, శాస్త్రానుసార

మున సేవింపకున్న వాని యప్రాప్తియో లేక విపరీతఫలప్రాప్తియో జనించునుగదా !

ఇంతియె కాక వాని నశాస్త్రీయముగ సేవించువానికి జననిందయు రాజదండనము నవశ్యంభావులే. నరకము లప్రత్యక్షములు గాన వాని చింత మనకు వలదు. మోక్షమనఁగా దుఃఖహేతువులనెల్లఁ బరిత్యజించి కేవలానందము ననుభవించుటయే యని పరమార్థముగదా ? ఆనందమును వీడి దుఃఖ మనుభవించువాఁడు నుండునా ?

మోక్షము పారలౌకిక మనుట ప్రసిద్ధమే కాని యైహికానందమఖండమైనచో నది బ్రహ్మానందమునకు నాతిభిన్నము కాకపోదు. ఇట్లు పురుషార్థములనెల్ల నైహికముగ సమన్వయించుట గ్రంథవిస్తరమగును గాన నుపనయనాది సంస్కారముల నైహికప్రత్యక్షఫలప్రదత్వమును జూపి విరమించెద.

ప్రాతఃప్రబోధము:— మన ధర్మశాస్త్రములందు బ్రాహ్మముహూర్తమున నిద్రనుండి మేల్కొనవలయు నని యొక నియమము గలదు. బ్రాహ్మముహూర్త మనఁగా సూర్యోదయమునకు ముందు నాలుగుగడియలకాలము. దానియందు మేల్కొనుట సర్వవర్ణముల వారికిని సర్వాశ్రమములవారికి నత్యంతహితకరమును నత్యావశ్యకము నని ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి.

శ్లో॥ "బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ ధర్మార్థా చానుచింతయేత్
కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవచ॥ (మనువు)

శ్లో॥ "కాయక్లేశం తదుద్భూతం ధ్యాయీత మనసేశ్వరమ్॥ (పరాశరః)

శ్లో॥ "బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ మానసే మతిమాన్ నృప
విబుధ్య చింతయే ద్ధర్మ మర్థం చాప్యవిరోధినమ్॥ (విష్ణుపు)

పైరీతిని మన్వాదులే కాక గౌతమాపస్తంబాదులును బ్రాహ్మముహూర్తమున లేవవలయు నని వక్కాణించియున్నారు. ఈ రీట్లు

బోధించుట కేమి హేతువో విచారింతము. మను పరాశర విష్ణుపురాణ ములవచనములందుఁ గేవలము లేచుటయేకాక ధర్మార్థచింతన మాచ రింపవలయు నని కలదు. కావున నెల్లరు నట్లాచరింపవలసినదే. లోకము మూఁడుపాళ్ళుధర్మపరము ననర్థకము నగుటచే నీ శాస్త్ర మును నిరాకరించినది. కాని వారి సూక్తుల నేరును బాగుగ విమర్శింప లేదు. పైవాక్యములందుఁ గాయక్లేశ మొనరింపవలయు నను నొక యుక్తిముక్తాఫలము గలదు. దానిని వారెందు కుపదేశించిరో చూతుము.

వారివాక్యములం దారోగ్యరక్షణము ముఖ్యముగా నుపదేశింపఁ బడినది. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" శరీరమున్న నెల్ల ధర్మ ములు సాధింపనగును. అది నష్టమైనను వ్యాధిదుష్టమైనను నేఘనియు సాగదు. కావునఁ బ్రథమమునఁ బ్రాతఃకాలమున లేచి శరీరవ్యా యామ మొనరించిన భుజించిన పదార్థరసము మథితమై సారమగు రక్తము నాడికలమూలమున శరీరమెల్లఁ బ్రవహించి జీవితమును బోషిం చును. దాని నుపేక్షించినయెడల నన్నరస మొకప్పుడు రక్తరూపము నొందక వ్యాధి నాపాదించును. కావుననే ధర్మశాస్త్రకారు లంతనిర్బం ధము చేసియున్నారు. ఈవిషయమున నాయుర్వేదాచార్యుఁ డగు వా గ్భటుఁ డెట్లుచెప్పెనో చూతుము.

శ్లో. "బ్రాహ్మే ముహూర్త ఉత్తిష్ఠేత్ స్వస్థో రక్షార్థమాయుషః
శరీరచింతాం నిర్వర్త్య కృతశౌచవిధిస్తతః (అష్టాంగహృదయం)

ఆయూరక్షణము గోరువాఁడు బ్రాహ్మముహూర్తమున లేచి శరీరచింత నెఱవేర్చి శౌచాదుల నిర్వర్తింపవలయునని వాగ్భటుఁ డుద్భ టముగ ఘోషించుచున్నాఁడు.

పై ధర్మశాస్త్రకారుల వచనముల నధర్మపరులై యంగీకరింప కున్నను దమశరీరమునైన రక్షించుకొనవలదా? ఆయువు నశించినపిదపఁ

జేయు పనియేమి? ఈవిషయమునే ఆంగ్లవైద్యులు గూడ ప్రాతర్యాత్ర (morning walk) అను పేరిట నారోగ్య రక్షణమున కొక చికిత్సను బ్రబోధించుచున్నారు.

ప్రాతఃస్నానము:— కల్యకృత్యములందు స్నానమొకటి ముఖ్యమయినది. స్నానము చేయక యేధర్మకార్యమును జేయరాదు. ప్రతి కర్మకును మొదట "స్నాత్వా, ఆచమ్య" అను పదములుండును. కాని మనవారు కర్మలెట్లు బహిష్కరించిరో యట్లే స్నానముకు విసర్జించుచున్నారు ఇది మిగుల నన్యాయమగునది. పద్మపురాణమునందు—

శ్లో. నైర్మల్యం భావశుద్ధిశ్చ వినా స్నానం నజాయతే
తస్మాన్మనోవిశుద్ధ్యర్థం స్నాన మాదౌ విధీయతే॥
అనియు మఱియు నితర ధర్మనిబంధనములందు
శ్లో. తతో నదీం సమాగమ్య గంగాధ్యానపురస్సరమ్
నాభిదఘ్నజలే స్థిత్వా త్రివారం స్నాన మాచరేత్
నిరుద్ధకర్ణనాసస్తు త్రివారం మజ్జనం చరేత్
త్రిరాచమ్య సమాప్లుత్య శిఖాం బద్ధ్వా సమాచమేత్
ప్రాణానాయమ్య సంకల్ప్య త్రివారం మజ్జయేత్పునః॥

అనియుఁ జెప్పఁబడియున్నది. పైధార్మికు లిట్లు నిర్ణయించుట కేవల మైహికమైన యారోగ్యమును గోరియేయని విశదమగుచున్నది. ఏలయన, నీటియందుఁ బ్రాణశక్తి యమితముగ నున్నది; విద్యుచ్ఛక్తి యున్నది.

కావున స్నానముచే నాయువు వృద్ధిపొందును. వేదమునందు "ఆమయావీ చిస్స్వాత, ఆపోవై భేషజం, భేషజమేవాస్మై కరోతి సర్వమాయురేవ" అని కలదు. ఈయర్థమునే యాయుర్వేదాచార్యు లిట్లు వివరించిరి.

శ్లో. "దీపనం వృష్య మాయుష్యం స్నాన మూర్జోబలప్రదమ్
కండూమలశ్రమస్వేద తంద్రాతృడ్దాహపాపజిత్"

శ్లో. "స్నానం సర్వాంగశుద్ధి ర్మలినశుచికరం దేహకాంతిం కరోతి
కండూఘ్నం స్వేదహారి శ్రమకరణహరం పైత్యదాహాది మోహాః
దీప్తాగ్నిర్ధాతువృద్ధి స్సుఖకర మమలం స్తంభకృత్పావనంచ
నానారోగోపశాంతి ర్హితకరణకరం చిత్తశుద్ధిం కరోతి॥ (చరకః)
శ్లో. "అస్నాతస్య శరీరస్య వహ్నిస్సర్వాంగ గోచరః
స్నానేనైకత్వమాపన్న స్తస్మాత్ స్నానం సమాచరేత్॥"

అనఁగా స్నానము వలన శారీర మానసిక సర్వేంద్రియ దార్ఢ్యము సర్వవ్యాధి పరిశాంతియు లభించును. ఇంతియకాక రాత్రినిద్రా కాలమందు రక్త పరివాహముతోఁగూడ శరీరమంతటను వ్యాపించిన వహ్నిరూప పిత్తము స్నానమువలన స్వస్థానమందుఁ బిండీకృతమై భుక్త పదార్థములను బచించును. దీనివలన నేరోగములును దరికి రాఁజాలవు. ఇట్టిపవిత్రస్నానమును విడుచుట యకర్మమేకదా?

దివాస్వాపము:—పగలు నిద్రపోరాదని ధర్మశాస్త్రములందెల్ల వినఁబడుటయేకాక యాబాల గోపాలమునకునుగూడ బాగుగఁ దెలిసిన విషయమే. కాని యాచరణమునందు మాత్ర మెవరోకాని యుంప లేదనుటయు వాస్తవము. పగటి నిద్రవలన మనకు ధర్మలోపమే కాక మారోగ్యమునకత్యంతము హాని కలదని నుడివినపు డెందఱమనములు విహ్వాలము లగునో? పగలు నిద్రించుట సౌకుమార్యమనియు నైశ్వర్య లక్షణమనియు సుఖకరమనియు నెంచువా రెందఱో యుందురు. వార లీక్రింది వాక్యములు గమనింతురు గాక!

సూ. వికృతిర్హి దివాస్వాపోనామ, తత్ర స్వపతా మధర్మ స్సర్వదోషప్రకోపశ్చ, తత్ప్రకోపాచ్చ కాసశ్వాస ప్రతిశ్యాయ శిరోగౌరవాంగమర్దారోచక జ్వరాగ్ని దౌర్బల్యాని భవన్తి. (సుశ్రుతుఁడు)

దీనిలోఁ జెప్పఁబడిన యొడలినొప్పులు, తలబరువు, రొంపమొదలగు వ్యాధులు తఱచుగ నెల్లరకు ననుభూయమానములే యైనను

దివాస్వాపమును మాత్రము వీడఁజాలకున్నారము. ఇదికడు శోచ్యము.

జాతకర్మ:—ఇఁకఁ బైని ద్విజత్వాపాదకములగు సంస్కారవిశేషములఁగూర్చి కొంత ముచ్చటించుకొందము. సంస్కారములకెల్ల గర్భాధానసంస్కారము ముఖ్యమనుతలంపున నదియే ధర్మశాస్త్రములందును జ్యోతిశ్శాస్త్రమందును నాయుర్వేదమందును మొదటఁ జెప్పఁబడినది. అయినను నెండ్రొకకారణమున జాతకర్మాదిగ నే నిపుడు విమర్శించుచున్నాఁడను. దానికి విజ్ఞులు మన్నింతురుగాక! "జాతమాత్రస్య యత్క్రియతే కర్మ త జ్జాతకర్మ" శిశువు జనించిన వెంటనేచేయు కర్మ గావున జాతకర్మ నాఁబడును. ఈ కర్మముచే సంస్కరింపఁబడని శిశువునకు ద్విజత్వము సిద్ధింపదనిమాత్రమే ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడినది. కాని యిందలి హోమాదులుమాత్రము కేవల మాయురారక్షణమునకుమాత్రమే యుపయోగించునవి. జాతకర్మసంకల్పముగూడ "అస్యకుమారస్య గర్భాంబుపానజనితదోష నిబర్హణాయుర్మేధావృద్ధి బీజగర్భసముద్భ వైనోనిబర్హణద్వారా" అని యారోగ్యరక్షణమునే బోధించుచున్నది. దీని కనుకూలముగఁ బ్రధానక్రియలు రెండు గలవు. ఏవన- మధుసర్పిః ప్రాశనము, ఫలీకరణహోమము, ననునవి. మొదటిదానివలన గర్భాంబుపానమువలనఁ గలిగిన కఫోద్రేకము నశించును. రెండవదానివలనఁ గ్రిమికీటకాదులు నశించుటయే గాక చర్మశుద్ధియు శిరశ్శుద్ధియుఁ గల్గును. దీని నాయుర్వేదాచార్యు లిట్లుపదేశించిరి. "తిలానతసీసర్షపకణాంశ్చ ప్రకిరేత్, అధిష్ఠానే చాగ్నింప్రజ్వాలయేత్, ప్రణీతోపాసనం చావేక్షేత." (సుశ్రుతుఁడు)

"ద్వాభ్యాం దర్భేణ సిష్టర్క్యాం బద్ధసువర్ణేన ఘృతయుక్తం మధు కుమారం సకృత్ప్రాశయిత్వా" (సింగాభట్టీయ ధర్మశాస్త్రము)

"తస్మాత్ ప్రథమేహ్ని మధుసర్పిరనంతామిశ్రం మంత్రపూతం త్రికాలం పాయయేత్" (సుశ్రుతుఁడు)

ఈ ప్రకరణమునఁ జరకాచార్యుఁడు మిగుల విస్తరముగఁ జెప్పినాఁడు. ఇప్పటికిని పల్లెటూళ్ళయందు శిశువునకు నీరార్చిన వెంటనే సాంబ్రాణి, యుల్లిపొట్టు, భూతులసి, తవుడు, ఆవాలు, నూనెలను గలిపి ధూపము వేయుట యాచారముగ నున్నది. కాని జాతకర్మసంస్కారము మాత్ర మంతరించి యుపనయన కాలమందే చేయఁబడుచున్నది. ధర్మశాస్త్రములం దాయుర్వేదానుసారముగనే నాభినాళచ్ఛేదముతోఁగూడనే జాతకర్మ చేయవలయునని చెప్పఁబడినది. కాని మనవారు గతజలసేతుబంధనముం బోలెఁ గాలము నతిక్రమించి సంస్కరించుట నిష్ఫలమే యనక తీఱదు.

నామకరణము:— వర్ణక్రమము ననుసరించి శర్మ వర్మ గుప్త దాసాఖ్యపదాంతములుగా నామముల నొనర్పవలయునని ధర్మశాస్త్రకర్త లెల్లరుఁ జెప్పియున్నారు. అట్లొనర్చిన "ఏవంకృతే శుచి తత్కులం భవతి" కులము పవిత్రమగు నని శంఖలిఖితులు ఫలమును జూపిరి. కాని యంతమాత్రమే కాక యీపదములకు నా కాలపు వర్ణవ్యవస్థకును సంబంధ మధికముగఁ గలదు. శర్మ యన సుఖము. శర్మపదము బ్రాహ్మణుని పేరిచివర నతికించిన నా బ్రాహ్మణుఁడు సుఖకర్త యని కాని సుఖభోక్త యని కాని యర్థ మగును. కాని మొదటియర్థమే వాస్తవ మనఁదగును. పుట్టిన దాదిగ నడవులందే నివసించుచు నాకలములు దినుచు నిరాహారు లయ్యుఁ దపము లొనర్చి విద్యల నార్జించి బుద్ధిబలమునను దపోబలమునను దేశమున కనర్థములు రాకుండఁ గాపాడుట బ్రాహ్మణుని విధియయి యున్నది. ఆకలము దిను వనవాసికి సుఖవార్త దూరమే కావున రెండవయర్థము పొసఁగదు. కావుననే బ్రాహ్మణులను బూర్వు లంతగా గౌరవించెడువారు. ఇప్పుడు బ్రాహ్మణున కెట్లా శర్మపద ముపచరించునో విమర్శింపుఁడు. ఇఁక వర్మ మనఁగాఁ గవచము. అనఁగా మన యొడలిని గవచ మెట్లు రక్షించుచున్నదో యట్లు రాజు జనులఁ బాలించువాఁడు. దానిచే వర్మపద మన్వర్థముగ నుండెడిది. క్షత్రపదము నట్టే క్షతాత్ - త్రాయతే, క్షత్త్రః - దెబ్బ

తగులకుండఁ గాపాడువాఁడు. రాజన్యుల కీపద మెంతయుచితమో యోచింపవలయు.

గుప్త=రక్షింపఁబడువాఁడు. ఇది వైశ్యనామము. వైశ్యుఁడు సార్థవాహుఁడై దేశాంతరములతోఁ గ్రయవిక్రయ వ్యాపారము జరుపుచుండ వాని వ్యవహారమునకు హాని రాకుండఁ గాపాడుట రాజు చేయుపని. రాజుచేఁ గాపాడఁబడువాఁడు గావున వైశ్యుండు గుప్తుఁడు నాఁబడును. ఇట్లే శూద్రునకు దాసుఁ డని పేరుకలదు. వానివృత్తి శుశ్రూష సేయుట. అనఁగాఁ గేవల మింటిపని సేయుటయే కాదు, రాజు సెప్పు సేఁతలకులోఁబడి యోధుఁడై దేశమును గాపాడుటే శూద్రుని ప్రధానవృత్తి యని చరిత్రములు వాకొనుచున్నవి. ఆర్యులారా! ఇంత సార్థకములై మనోహరములైన బిరుదుల విసర్జించు టేటిన్యాయమో తిలకింపుఁడు. ఇంతియ కాక యేనాఁడు చాతుర్వర్ణ్యము తన విహిత నామములను దదనుగుణములైన వృత్తులను విడనాడెనో నాఁటినుండియే మన యార్థిక దుస్థితి సంభవించిన దనుట సాహసమగునా?

ఉపనయనము :— ఉపనయన మనఁగా విద్యాభ్యాసారంభ కాల మని ఫలితార్థము. ఈకర్మము బాలుఁడు గురువు చెప్పిన విషయమును గ్రహించి దానిని జ్ఞప్తియం దుంచుకొనుపాటిశక్తి గలుగు వయస్సునఁ జేయవలయును. ఈవిషయమునే సుశ్రుతుఁ డిట్లు పలికెను. " శక్తిమంతం చైనం జ్ఞాత్వా యథావర్ణం విద్యాం గ్రాహయేత్ " ఈతలంపుననే వర్ణక్రమము ననుసరించి కాలనియమ మేర్పరుపఁబడినది. దీనియందు బాలునకు భిక్షాశనము, గురుశుశ్రూషణము, ఆశ్రమవాసము, విద్యాభ్యాసమును విధింపఁబడును. ఉపనీతుఁడై యథాశాస్త్రముగ విద్యాభ్యాస మొనర్చిన బాలునికి శరీరదార్ఢ్యము ధైర్యము సుఖానపేక్ష బుద్ధికుశలత కష్టసహత్వమును నలవడును. కావున నీకర్మవిశేషము కేవల ద్విజత్వాపాదకమే కాక భావిసంసారభరణోపదేశకముకూడ నగును. కాఁబట్టియే యిది మిగుల ముఖ్యకర్మగా నెల్ల

రచే నంగీకరింపఁబడినది. అయినను మన యిప్పటివారుమాత్ర మీ కర్మమును కేవలము నాటకమురీతిని నిష్ఫలముగ నాచరించుచు దాని వలని ఫలము నావంతయు నందలేకుండుట కడుంగడు శోచనీయముగ నున్నయది.

వివాహము - గర్భాధానము :_ ఏకర్మముల నెట్లు సన్న్యసించినను వివాహగర్భాధానముల విసర్జించినవారు మాత్ర మగపడలేరు. కాని వీనియందుఁగూడఁ గొంతశాస్త్రాతిక్రమణము గలదు. అది వయోనియమమును బాటింపమియే. పురుషుఁడు విద్యార్జనమును ముగించువఱకు ముప్పది లేక ఇరువదియెనిదిదేండ్ల వయస్సగును. అపుడు వివాహము చేసికొనవలయును. ఈ సందర్భమున ధర్మశాస్త్రకారులు —

శ్లో॥ "త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీమ్
త్ర్యష్టవర్షో ష్టవర్షాంవా ధర్మేసీదతి సత్వరః॥

"పితృధర్మార్థకామ్యప్రజాః ప్రాప్స్యతీతి" అని వక్కాణించి యున్నారు. ఆయుర్వేదాచార్యులుగూడ నిట్లు —

సూ॥ అథాస్మై పంచవింశతివర్షాయ ద్వాదశవర్షవతీం పత్నీముద్వహేత్. (సుశ్రుతుఁడు) చెప్పియున్నారు. కాని మన బహుశ్రుతులుమాత్రము పైనియమముల నుల్లంఘించి బాల్యులపెండ్లి కావించుచున్నారు. గర్భాధానమునుగూడ యుక్తకాలము రాకపూర్వమే ఋతుస్నాత కాకపూర్వమే లేక వ్యాధిచే బాల్యమున ఋతుదర్శనమైనంతమాత్రముననో జరుపుచున్నారు. దీనివలన నెంతహాని కలదో విచారింపుఁడు.

శ్లో॥ "ఊనషోడశవర్షాయా మప్రాప్తః పంచవింశతిమ్
యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థ స్స విపద్యతే
జాతోవా నచిరం జీవే జ్జీవేద్వా దుర్బలేంద్రియః
తస్మాదత్యంత బాలాయాం గర్భాధానం నకారయేత్॥ (వాగ్భటః)

ఈ యర్థ మనర్థకముగాక లోకమం దెల్లెడల ననుభూయమా నార్థమే. పాశ్చాత్యవైద్యులుగూడ నీవిషయమునే ఘంటానాదముగ వక్కాణించుచున్నారు. ఈ విషయముననే రజస్వలానంతరవివాహ సంస్కార ముదయించినది. ఇట్టి ముఖ్యవిషయముననే మనము శాస్త్రముల నుల్లంఘించి నిర్మర్యాదగాఁ బ్రవర్తించుటయుఁ బ్రోత్సహించుటయుఁ దగవగునా ?

పుంసవనము:— ఇయ్యది మిగుల విచిత్రమగునదియు నావశ్యకమగునదియునగు కర్మవిశేషము. ఇందలి విచిత్రమేమన; గర్భస్థశిశువు పురుషుఁడు గావలయు నన్నను, స్త్రీ గావలయు నన్నను, దానికిఁదగిన క్రియలఁ బ్రయోగించుటయు, దానివలన నిష్టఫలము నందుటయును— పుంసవనపదమును, సింగాభట్టీయ మిట్లు వివరించినది. "అంతర్వత్నీ కర్మణా నేన సూతే పుమాంసమితి వనమ్రూఢిమత్" అని. పుంపదము పలక్షణముగ స్త్రీపుంససాధారణవాచియని యెఱుంగునది. ఈ కర్మము చాల ముఖ్యమైనదని ధర్మశాస్త్రికారులు చెప్పుటయేగాక యాయుర్వేదాచార్యులుగూడ నిట్లు నుడివియున్నారు.

శ్లో॥ అవ్యక్తః ప్రథమే మాసి సప్తాహాత్కలలీ భవేత్
గర్భః పుంసవనాన్యత్ర పూర్వం వ్యక్తేః ప్రయోజయేత్
బలీ పురుషకారోహి దైవమ ప్యతివర్తతే॥ (వాగ్భటుఁడు)

దైవముకంటెఁగూడఁ బురుషప్రయత్నము బలవత్తరము గావున గర్భము వ్యక్తపడకముందే తప్పక పుంసవనము జరిగింపవలయునని దీని తాత్పర్యము. క్రియావిషయమును, ధర్మశాస్త్రకారులు పండ్లతోఁ గూడిన మఱ్ఱికొమ్మను దెచ్చి యారసమును గర్భిణిచే నాసాద్వారమున గర్భపర్యంతముఁ బీల్పింపవలెనని చెప్పిరి. ఆయుర్వేదాచార్యులు వట శాఖయేగాక, లక్ష్మణపంజి, సహదేవి, విశ్వదేవి, శ్వేతబృహతీమూలముల రసమునుగూడ నస్యము చేయవచ్చునని చెప్పిరి. ఇట్లు ధర్మశాస్త్రాయుర్వేదముల ననుసరించి తదుక్తవిధుల నాచరించిన నిప్పుడగపడుచున్న దత్తపుత్రులసంఖ్య తగ్గియుండునేమో !

సీమంతము:— పుంసవనము మనము జరిగింపకున్నను సీమంతమను నొక కర్మమునుమాత్రము జరుపుచున్నారము. ఈ సంస్కారమునందు గర్భిణికి నఱచేయి మొదలు బాహుమూలమువఱకు గాజులు తొడిగించుటయే మన యాచారము. దక్షిణదేశమునం దింతియకాక నెత్తినిండ గంపెడు పూవుల బరువు వెక్కించుటకూడ నక్కడి కొందఱి యాచారము. కాని యీ సంస్కార ప్రయోజన మెవ్వరును దెలియకున్నారు. "కేశరచనావిశేషస్య ఉన్నయనం ఉత్తోలనమ్రతేతి సీమంతోన్నయనమ్" (ప్రయోగపద్ధతి)

"స్త్రీణాం కేశమధ్యరేఖావిశేష స్సీమంతః స ఉన్నీయతేఽస్మిన్కర్మణీతి సీమంతోన్నయనమ్" (సింగాభట్టీయము)

కేవలము గాజులు తొడుగుట పూలుముడుచుటలే కాక యేదు పందిముల్లు మేడిపుల్ల దర్భపుంజము నొకటిగాఁ జేర్చిన కుంచికతో నాభి మొదలు, పాపటవఱకు రాచి యా కుంచికను శిరస్సునందే యుంచి కట్టుట సీమంతమని శాస్త్రములు చెప్పుచున్నవి. ఆ కుంచికయందు విద్యుచ్ఛక్తికలదనియు నది నాభిని (గర్భోపరిబహిః ప్రదేశము) స్పృశించినపు డాశక్తి గర్భమునందుఁ బ్రవేశించి పిదపఁ దలలో నా కుంచిక యున్నంతకాలము గర్భమున కేయాపదలు రాకుండఁ గాపాడుననియు నూహింపనగును. ఇంతియకాక శిరోజముల రెండుపాయలుగా విభజించి నడునెత్తి నౌషధప్రయోగము సేయుట స్వాస్థ్యరక్షణమునకవసరమని ప్రాతిస్నాన ప్రకరణమున నుదాహరింపఁబడిన "కేశాన్ కృత్వాద్విధాద్విజ" అను వచనమువలనను దెలియవగును. కావున సీమంతము గర్భస్థశిశుసంరక్షణార్థై యేర్పడిన దనుట స్పష్టము.

ఈ పుంసవనసీమంతము లెప్పు డెప్పుడు జరపవలయునని శంక యుదయించును. ధర్మశాస్త్రకారులలోఁ గొందఱు 2-వ మాసమందు గర్భమున కవయవోత్పత్తి కారపూర్వమే పుంసవనమును 3-వ మాసమున సీమంతమును తప్పక సేయవలయునందురు. కొందఱు విహితకాల మననుకూలమైనచో నెప్పుడైనఁ (దొమ్మిదవనెల మించకుండఁ) జేయవలయునని చెప్పుదురు.

మఱియు నీరెండు సంస్కారములును గర్భిణికి సంబంధించినవే కాని గర్భమునకు సంబంధించినవి కావు గావునఁ బ్రథమగర్భసమయమున సంస్కరించినఁ జాలునని కొందఱును, ఈకర్మలు గర్భసంస్కారములే కావునఁ బ్రతిగర్భమును సంస్కరింపవలయు నని కొందఱును జెప్పు చున్నారు. ఇం దేపక్ష మాదరణీయమో చెప్పఁజాలను గాని పుంస వనము గర్భస్థపిండమున కంగప్రత్యంగము లేర్పడకముందే జరిపినఁ బిండము మన సంస్కారానుగుణముగ స్త్రీగఁ గాని పురుషుఁడుగఁగాని మాఱుట కుద్దేశింపఁబడినది కావునను సీమంతము కేవలము గర్భరక్షణ మునకై యుపయోగించునది కావునను నాలవమాసమున గర్భమునకుఁ బురుషావయవములుగాని స్త్ర్యవయవములుగాని జనించిన పిదప నా శిశువును మన యిచ్ఛవచ్చినరీతిని మార్చుట కనువుపడదు గావునను, నీ సంస్కారములు వరుసగ 2-వ, 3-వ మాసములందే జరిపితీఱవలయు ననియు, నొక్కగర్భమును సంస్కరించుటచే నౌషధబలము సర్వగర్భ ములను సంస్కరింపఁజాలదు గావునఁ బ్రతిగర్భమును సంస్కరింప వలయు ననియుఁ జెప్పుపక్షమే సమంజసమని నా యభిప్రాయము. ఇఁక నీ వ్యాసము నుపసంహరించుటకు ముందుగ నీకర్మలలోఁ గ్రియలతో పాటుగ మంత్రముల నుచ్చరింప నేల యని కొందఱు శంకింతురు గాన నాకుఁదోఁచినరీతిని గొంత ముచ్చటించెదను. మంత్రములను ధర్మ శాస్త్రకారులే కాక యాయుర్వేదాచార్యులు గూడ నాదరించి యున్నారు. వేదములయందుఁ గొన్నిభాగములు కేవల మంత్రములే. మంత్రశాస్త్రమను పేర నసంఖ్యములగు గ్రంథములున్నవి. తేళ్ళకుఁ, బాములకుఁ, బిచాచములకు నివి యవి యననేల కష్టసుఖములకెల్ల మంత్రము లున్నవిగదా? వీని కేశక్తికలదో విచారింతము.

ఓంకారరూపమగు ధ్వనివలనఁ బ్రపంచ ముద్భవించినదని శాస్త్రి కులమతము. వేదమం దీయర్థముగలదు. సామగానమువలన వర్షములు కురియునని మన గ్రంథములందుఁ గలదు. ఇంతయుకాక సర్వరోగము

లును గానమువలనఁ జక్కఁబడునని యమెరికా వైద్యులు వ్రాయుచున్నారు. కావున నక్షరాత్మకమగు ధ్వనియందుఁగూడ నట్టి శక్తులున్నవనియు నక్షరముల సంగ్రథనావిశేషమున నిష్టఫలము లభించుట యాశ్చర్యము గాదనియు నా సంఘటనావిశేషమే మంత్రములు గావున వానిని మనము విడువక మిగుల నాదరింపవలయు ననియు నా యభిప్రాయము.

పైని జెప్పినరీతి ననంతఫలదములని స్థూలదృష్టికే గోచరమగుచున్న ధర్మశాస్త్రగ్రంథముల మాహాత్మ్యము వర్ణింప నెవారితరము. అయినను జాపలమున నాకుఁదోఁచినరీతిని గొన్నితప్పులను గొన్నియొప్పులను గుదిగూర్చి వ్రాసితిని. నన్ను మన్నించి మన ధర్మశాస్త్రములందు నేనూహించినంతమాత్రమేని ఫలమున్నయెడ వాని నాదరించి తమ క్తకర్మల నాచరింప వేఁడెద. మొదటఁ దెలిపిన రీతిని బురుషార్థ చతుష్టయ సంపాదనోపాయములగు మన ధర్మనిబంధనము లీశ్వరానుగ్రహమున నెప్పుడేని బూర్వౌన్నత్యమును దిరిగి పొందుఁగాక !



## పల్నాటి భక్తసమాజ ద్వితీయ సమావేశము.

స్వస్తిశ్రీ క్షయనామసంవత్సర భాద్రపద శు ౧౦ లు శుక్రవారము పల్నాడు తాలూకా శ్రీ సనాతనభక్తసమాజ ద్వితీయసమావేశము వొప్పిచెర్లలో ప్రారంభమై ఉదయము 9 ఘడియలకు నృత్తగీతవాద్యంబులు నామసంకీర్తనలతో శాలాప్రవేశ మొనర్చి యందు శ్రీరాధాకృష్ణస్వామివారి విగ్రహారాధనము అష్టదిక్పాలకపూజ యున్నూ పూజాకైంకర్యములును శ్రీ కాశావఝ్ఝల ఆదినారాయణ అవధానిగారు కార్యదర్శిచే చేయించి శ్రీస్వామివారి అనుగ్రహపాత్రులుగా నొనర్చెను. ఇంతలో సంఘసభ్యులు ప్రేక్షకులు గుమిగూడి శ్రీవేదమూర్తులగు పుల్లాభొట్ల పాపావధానిగారు ఘంటం సీతారామావధానిగారు మున్నగు అవధానులు అందరు సంఘసభ్యులతో కలసి శ్రుతిపారాయణయును నామసంకీర్తనయును గావించిరి. శ్రీ పిరాట్ల శ్రీశైలశాస్త్రిగారు మున్నగు యువకులచే అష్టపది తరంగ కాలక్షేపణయును శ్రీ భేతనభొట్ల వెంకటకృష్ణశాస్త్రిగారు వారి కుమారులతో కలసి అధ్యాత్మసంకీర్తనయును జనహృద్యమగునట్లొనర్పబడియె. పిమ్మట కార్యదర్శి ప్రారంభోపన్యాసమును వచించెను. ఇంతలో మధ్యాహ్నంబు అగుటయు కార్యక్రమము ఆపబడి సభ్యులు స్నానపానభోజనము లొనర్చి

అయిదు నిమిషములు విశ్రయించిరి. పిమ్మట సభా ప్రారంభమై సాయంత్రి 4 నాలుగు ఘంటలనుండి శ్రీ ఘటం మాణిక్యశాస్త్రిగారు భాగవత పురాణమును అతిమధురముగా 6 ఆరు ఘంటలవరకు వచించిరి. తరువాత సంధ్యావందనాది కృత్యములను నెరవేర్చి శ్రీ స్వామివారి సన్నిధియందు సభ్యులందరు దయచేసి ప్రదోషపూజయు శ్రుతి పారాయణయు తరంగ కాలక్షేపణయు పరాకులను వచించిరి. సాయంత్రి భోజనానంతరమున శ్రీ పిన్నిల్లి మల్లయ్యగారను భాగవతుల హరికథా సుధారసమును సభ్యులకు ప్రేక్షకులకు తనివిదీర గ్రోలచేసిరి. యిట్లు మొదటిరోజు కార్యక్రమము ముగిసెను. ఆరోజే ప్రభాత సేవయు నొనర్పంబడియె. రెండవరోజు వుదయము శ్రుతి నామ తరంగ అష్టపది కాలక్షేపణయు శ్రీ లంక శివయ్యశాస్త్రిగారు వర్ణాశ్రమ ధర్మము భక్తియోగమునుగూర్చి శ్రుతిస్మృతులతో గంభీరోపన్యాసమును సుందరముగా వచించిరి. పిమ్మట శ్రీ నారాయణంభొట్లు శీతారామశాస్త్రిగారి అతి మధురమగు పురాణ కాలక్షేపణతో మధ్యాహ్నంబు అయ్యెను. భోజనానంతరము శ్రీ మంగళగిరి హరిదాసుగారు సక్కుబాయి చరిత్ర యను హరికథను చక్కగా వచించిరి. సంధ్యావందనానంతరం పూజావిధానము పరాకులు శ్రీ వెంపటి శ్రీశైలం గారి పాటకచ్చేరి మహదానందము నొసంగెను- పిమ్మట కార్యదర్శి సత్యనారాయణ స్వామివారి వ్రతమునుచేసి శ్రీస్వామివారి అనుగ్రహమును పొందెను- సాయంత్రి భోజనానంతరము లంక సత్యనారాయణభాగవతునిచే ద్రౌపదీస్వయంవరము అను హరికథ సకలజనులకు కర్ణభూషణముగా ఉపన్యసింపఁబడియె- పిమ్మట ప్రభాత సేవయు ఇట్లు రెండవరోజు కార్యక్రమము గడిచెను- మూడవరోజు శ్రీ లంక సీతారామశాస్త్రిగారి వేదాంతోపన్యాసమున్ను మధ్యాహ్నము తరంగ కాలక్షేపణయు శ్రీ గోలి మల్లికార్జున శాస్త్రిగారిచే గోదేవతానిర్బంధవిముక్తియు తద్దేవతోత్సవంబును జరుపఁబడియె-పిమ్మట సాయాహ్నము లంక సుందరరామశాస్త్రిగారి అతిమధురమైన భాగవతపురాణమున్ను సంధ్యావందనానంతరము పూజాపరాకులును సాయంత్రి భోజనానంతరము శ్రీ బూర్గుపల్లి నరసింహ మను హరిదాసుగారి హరికథయు అనంతరము కార్యదర్శి ఆహ్వాన సంఘపక్షమున నుపన్యసించుటయు శ్రీ లంక శివయ్యశాస్త్రిగారు సమాజపక్షమున ఉపన్యసించుటయు ప్రభాత సేవయు మున్నగు కార్యక్రమములచే ద్వితీయసమావేశము వొప్పిచర్లనిలయులగు ప్రజల అదృష్టమున జయప్రదముగా కొనసాగెను- ఈ ద్వితీయ సమావేశమునకు 33 ముప్పదిముగ్గురుసభ్యులు దయచేసి యీ కార్యక్రమమును నెరవేర్చినందులకు నేనెంతయు కృతజ్ఞుడను-

తిరిగి భక్తసమాజ తృతీయ సమావేశమునకు చిన్న అగ్రహారములో వెంపటి సుబ్బయ్యగారిచే ఆహ్వానింపబడియె-

# మూడు ఆస్తిక మతములు

# మూడు ఇంటి దొంగమతములు



ఆర్యులారా! సనాతనధర్మానుయాయులారా! ప్రథమములో నీ భరతఖండమున కేవల సాత్త్వికమతమనదగు వేదమతమె ప్రధానమతమై యుండెను. అనంతరం హిమాలయకనుమలనుండి మహమ్మదీయులు భారతలక్ష్మి వాశించి హిందూదేశములో ప్రవేశించి కేవల ............ గల తమ మహమ్మదీయ మత మవలంబించనివారిని ఖడ్గధారలకు బలియొసంగుటచే కొంద రా మహమ్మదీయ మత ప్రవిష్టులయినట్లు చరిత్ర లుద్ఘోషింపుచున్నవి. ఇటీవల హిందూదేశసంపద వాశించియే అయిరోపాదేశీయులు పలువురు వర్తకముచేయు నభిలాషతో ప్రవేశించినతరి యీస్టిండియా కంపెనీ వారను ఇప్పటి మన ఆంగ్లేయప్రభువుల పూర్వులు వర్తకమువలననేగాక నైజామువద్ద కొల్వుండి కొంతభూమి వేతనముక్రింద నాక్రమించి క్రమక్రమముగా దైవకృప (వెలుతురు) వారియందు ప్రసరించుటవలన హిందూదేశచక్రవర్తులయి వారి రాజకీయ (రాజస) మతమగు క్రైస్తవమతము సర్వోత్కృష్టమని హిందువులలోని పంచమాదులకు బోధించుటయేగాక వారికి రాజకీయోద్యోగాది పలువిధములగు ఆశలు పురిగొల్పి వారి క్రైస్తవమతములోనికి గొంపోజొచ్చిరి. పైన వ్రాసిన .................. మతములు మూడును ఆస్తికమతము లనగా దైవమొకడు గలడనియు పాపపుణ్యములకు విచారణగలదనియు నమ్ముచుండిరి.

ఇటీవల కేవల సాత్త్వికమతమైనట్లు కనుపడు బౌద్ధమత మొకటి చాలాకాలము క్రింద బయలుదేరి మన హిందూదేశ మాక్రమించినను అయ్యది నాస్తికమతమని దానిని బర్మా సిలోను మున్నగు విదేశములకు తరిమివైచిరి. దాని యంతర్భాగమనదగు జైనమతము మాత్రము అచటచట యిప్పటికి హిందూదేశములో నిల్చియున్నది. అట్టి అహింసావ్రతముగల జైనమతస్థుడే మహాత్ముడను అపరనామముగల కరంచందు గాంధిగారు.

రానురాను కాలముగడచినకొలది యింటిదొంగల నీశ్వరుడు బట్టలేడన్నట్లు మూడు ప్రచ్ఛన్న మతములు బయలుదేరినవి. అందు బ్రహ్మసమాజమతమువారు విధవా పునర్వివాహాది సంస్కరణాభిలాషులై ఆస్తికులమేనని బోధింపుచు వున్నవారి జన్నిదముల తీయించనారంభించిరి. అనంతరం దయానందులవారు ఆర్యసమాజమను పేర నొక మతము బయలుదేరదీసి బ్రహ్మసమాజికులు తీయించిన జన్నిదములు వేయించినారా యున్నట్లు శుద్ధిసంస్కరణమను పేర మహమ్మదీయులను గ్రామబహిష్కృతులను

హిందూమతములోలేని వేదపఠన గాయత్రి మంత్రోపదేశాదు లొనర్చుచుండిరి. అటు తర్వాత జన్నిదములు వేసెడివారు తీసెడివారు అందరు మా మతములో ఆధ్యాత్మికవిద్య నభ్యసించుటద్వారా సర్వమానవ సోదరత్వ మలవరచుకొనుడని కర్నల్, అల్కాటు, మేడం, బ్లావట్స్కి, అనిబెసాంటు మున్నగు అమెరికా, అయిరోపాదేశీయులు దివ్యజ్ఞాన (థియసాఫికల్) సమాజములో కొందరిని ప్రవేశింపజేశిరి. యీ మువ్వురు మతస్తులు యింటిదొంగలవలె వేదములను, భగవద్గీతలను, ప్రమాణములుగా దెల్పుచు క్రింది కోర్టువారి తీర్పులను హైకోర్టువారు పూర్వపక్షముజేశినట్లు వేదాదుల కపార్థములు గల్పించి విధవాపునర్వివాహ, రజస్వలానంతరవివాహ, స్వయంవివాహ, జాత్యంతర వివాహ గర్భాధానవయోనిర్ణయాది హిందూసాంప్రదాయవిరుద్ధశాసనము లొనరింపజేశిరి. యీ దుష్టశాసనములు జేయుతరి మన సనాతనధర్మానుయాయుల ఉపేక్షతో వారి పాపము వారినే హరించునని శుష్కవేదాంతవాక్యములు బల్కుటచేతనే ఇట్టి కీడులు మూడినవి, మూడుచున్నవి, మూడనున్నవి అంతటుబోక పైన బేర్కొనిన జైనమతస్థుడగు గాంధి స్వరాజ్యమిషతో అతివాద మితవాదాదులనేగాక చండాలాస్పృశ్యత తీసివేయుడనుటలో జస్టిసుపార్టి వారినిగూడ సమ్మతింపజేసి మన బావులు, సత్రములు, స్కూళ్ళు మున్నగు హిందూధర్మసంస్థలేగాక మన సనాతనధర్మమున కాయువుపట్టులనదగు దేవాలయాదులలోగూడ పంచమాదులు ప్రవేశించునట్లొక రాజశాసనమును నిర్మించుకొని మున్ముందు తిరుచానూరు (అలివేలుమంగాపుర) దేవాలయములో మాలదాసరిని ప్రవేశింపజేసిరి. బ్రహ్మసమాజ, ఆర్యసమాజ, దివ్యజ్ఞానసమాజీయులను యింటిదొంగలు మువ్వురు కన్నముద్రివ్వేరేగాని లోన ప్రవేశింపరైరి- యిపుడు గడిదొంగలనదగు గాంధిమతస్థులు మన ఆయువుపట్టులనదగు దేవాలయములలోపలనే ప్రవేశించిరి. గాన యికనైన గాఢనిద్రనుండి మేల్కొనుడు- మన ఆంగ్లేయప్రభువులు మనమతములో జోక్యముకల్పించుకొనమని ముందే వాగ్దత్తముజేశియుండిరి. ఆ వాగ్దత్త ప్రకారమే నేటివరకు పంచమస్కూళ్ళు మహమ్మదీయస్కూళ్ళు చర్చీలు మున్నగు ప్రత్యేకసంస్థలు నిర్మించి వానికి ప్రత్యేక గ్రాంటులు మున్నగునవి యిచ్చుచుండిరి. మన సనాతనధర్మానుయాయుల యుపేక్షచేతనే మన ప్రతినిధులమను పేరుతో రాజకీయ రంగముల కేగి రాజకీయములతో పాటు సాంఘికాచార సంస్కరణలుగా శాసనము లొనరింపజేసిరి- యీ దుష్టశాసనములు జేయింపుడని యే సంఘము యీ ప్రతినిధుల నంపిరి. ఈ మధ్య గర్భాధానవయోనిర్ణయ బిల్లుకాలమున బ్రహ్మశ్రీ కొప్పోలు సుబ్బనామాత్యుడుగారు "వేదిక్‌వర్ల్డు" అను పత్రిక నొకదానిని బయలు వెరదీసి తద్వారా షుమారు యెనుబదిమంది సనాతనధర్మానుయాయుల సంతకములతో కొన్ని ఆంగ్లభాషాకరపత్రము లచ్చొత్తించి హిందూదేశ రాజప్రతినిధి మొదలు ఆంగ్లేయ

పార్లమెంటువరకు బంపినట్లు స్వధర్మప్రకాశిన్యాది పత్రికలలో చదివితిమిగాని స్మృతి దప్పి మరణావస్థలోనున్న వానికి గరళమువాడినట్లు అయ్యవి తుదిప్రార్థనలగుటచే అరణ్యరోదనములయినట్లు దోచెడిని. ఇంక అభినవసరస్వతి శ్రుతిధర్మసంజీవిని, వర్ణాశ్రమధర్మసంస్థాపనము, బ్రాహ్మణపత్రిక, స్వధర్మప్రకాశిన్యాదిపత్రికలలో అస్పృశ్యతానివారణ, భారతకథాతత్త్వనిర్ణయము, బ్రాహ్మణధర్మాదులనుగురించి కొన్ని వ్యాసములు ప్రకటింపుచుండిరిగాని సంగీతమునకు చింతకాయలు రాలవట్లు అయ్యవి కార్యకారులు కాకున్నయవి. ఏమన నాపత్రికలు యేకొలదిమందియో స్వీకరించుచుండిరి. స్వీకరించినవారిలో ననుబోటి కాలయాపనలేనివారుమాత్రమే ఆమూలాగ్రముగా చదువుచుండిరి. మరికొందరు పుటలుతిరుగవేసియు నింకకొందరు కవరువిప్పకయే కుంకుమ మిఠాయిపొట్లములకమ్ముచుండిరి. పండితులనువారు కొందరు శ్లో॥ విద్యావివాదాయ ధనంమదాయ శక్తిః పరేషాంపరిపీడనాయ, యన్నట్లు ఒకరిసిద్ధాంత మొకరు ఖండించి స్వోత్కృష్టత గనుపరచుటయేగాని ఇంటిపోరు లంకకు చేటన్నసామెతను గుర్తెరుంగరయిరి. ఇందుకు తార్కాణము బ్ర॥ మల్లాది రామకృష్ణశాస్త్రిపాకయాజాదులే- గాంధిబోధ లన్నిటిలో వసమర్థులయినను అస్పృశ్యతానివారణలోమాత్రముపట్టుదలతో మొన్న మొన్న నే పశ్చిమ గోదావరీజిల్లా యేలూరులో జరిగిన ఆంధ్రమహాజనసభాకాలమున మన బ్రాహ్మణులు పంచములతోసహా పంక్తిభోజన మొనరించిరి. ఇది క్రమక్రమముగా సంఘమున కనర్థదాయకముగాదా? గతవత్సరం తూర్పుగోదావరీజిల్లా పలివెలగ్రామములో గాంధిమతస్థులు అస్పృశ్యతానివారణకై సభజేయగా మనసనాతనధర్మానుయాయులు అమలాపురంతాలూకా పాలంగిగ్రామములో బ్ర॥ జయంతిరామయ్య పంతులుగారి అగ్రాసనాధిపత్యమున నొక ఆస్తికసభగూర్చి తత్ఖండనసిద్ధాంత మొనరించిరిగాని యీయేటి యేలూరు సంకరమును ఖండించు సనాతనధర్మానుయాయులు ఒకరైన మన కృష్ణా గుంటూరుజిల్లాలలో బయల్వెడలిరా? వెడలినచో కాఫీ,ఉప్మా,నేయి, శర్కరాద్యధిక వెలగల పదార్థము లారగించువారేగాని మనపూర్వులవలె కందమూలఫలాశనులై పర్ణశాలావాసులు గాకున్నను మితవ్యయములాచరించువారరుదయి ఒకటిరెండు సమావేశములతోనే అంతమొందింతురు. మనపూర్వులు శతవార్షిక ద్వాదశవార్షిక సభలుజేసి సకలపురాణేతిహాసములు ప్రవర్తింపజేయగా మన మొక దుష్టమతఖండన మొనరింప మితవ్యయశీలురము కాకూడదా? శ్రీమద్విద్యాశంకరులు అనేక దుష్టమతములు ఖండనజేసినపు డింతవ్యయశీలు రుండిరా? వారికి మండనమిశ్రాదిప్రభువు లున్నచో మన కాంగ్లేయప్రభువులే ముందు వాగ్దానమొనరించి యుండిరి. ఇంతకు మన యుపేక్షయే ముందు మనల పలుసాంకర్యభాజనుల చేయనున్నది. అదేమన రాబోవు యేప్రిల్ మే

# IV

నెలలలో సంకీర్ణమతబోధకుడగు గాంధి మన దక్షిణదేశయాత్రకు రానున్నారు. అప్పటికి మనప్రతిపక్షు లేమిచేయజాలకున్నను సంకరమునకు దోడ్పాటుగా మన దేవాలయాదులలో పంచమాదులను ప్రవేశపెట్ట నుంకింపక మానరు. పంచగౌడులనదగు వుత్తరదేశీయులలో కొందరు మచ్ఛభక్షకులు గలరుగాన వారికి అస్పృశ్యాదులలో సంకరగా పట్టుదల లేదు. ఆ యాచారమే పంచద్రావిడులువసించు మన దక్షిణజిల్లాలో ప్రసరింపచేసినచో తిరుచానూరుదేవాలయమువలె మన దేవాలయము లన్నియు సంకీర్ణభాజనములగును. అపుడు మహాత్ముడుబోధించిన ఐకమత్యము ఆయనబోధయగు అస్పృశ్యతానివారణమూలముననే కలహాముగా మారగలదు. ............... హిందూమహమ్మదీయసమ్మేళన బోధించిరేగదా కోహాటుదురంతములు, కలకత్తా అల్లరులు బయల్వెడలి మహాత్ముని వుపవాసవ్రతదీక్షగా మారి తుదకు మహమ్మదీయ క్రోధాగ్ని సముద్రములోని బడబాగ్నివలె ............ నిప్పువలె కుమిలి కుమిలి (రాజిరాజి) శ్రద్ధానందుడను శతవృద్ధతాపసి ప్రాణములు దీయించెను. గడచినయేడు రంకు (వ్యభిచారము) వలదనిబోధించిన శ్రీ పుష్పగిరిపీఠాధిపతిని భృత్యుడే ప్రాణములుదీయగా తమస్త్రీలను తమ మతమును ప్రాణముకన్న మిన్నగాదలంచు ...... మతానుయాయులగు మహమ్మదీయులతో నా చెల్లాటము? అమృతోత్పాదనకాలమందు అక్కాచెల్లెంద్ర బిడ్డలమని తాత్కాలికసఖ్యమొనరించిన అసురసురలు అమృతోత్పాదనానంతర మెట్లయిరి. అట్లనే అమృతసర ఖిలాపతుల కాలములో సఖ్యముగోరిన హిందూమహమ్మదీయులకు ఐకమత్యము నిల్చెనా? అహింసప్రధానుడగు గాంధియు తన్మతానుయాయులగు అలీసోదరులును సఖ్యతపడి బోధించినంతమాత్రన సంఘేశక్తిః కలౌ యుగే యన్నట్లు కోట్లకొలదిసంఖ్యగల మహమ్మదీయు లూరకుందురా? యూరకుండు కారణమేనా! శ్రద్ధానందునికార్యము? కాలికి పనుపు నెత్తికి మును గన్నట్లు ఒకవైపు సఖ్యముగోరుచు ఇంకొకవైపున వారిమతస్థులను శుద్ధికార్యమనుపేర హిందూమతములో గల్పజనునా? అట్లు సనాతనమత మంగీకరించునా? దయానందుని ఆశాస్త్రీయబాధలు ముం దెట్లు పరిణమించునో యేరికెరుక. అట్లనే మహాత్ముని అస్పృశ్యతానివారణ సంఘవిప్లవకారణము గాకమానునా! ఇయ్యది నివారించుటకు మానవప్రయత్న మవసరములేదా? అవసరములేనిచో మార్జాలకిశోరన్యాయముగా యూరకున్నచో శిశువులు గండు (మగ) పిల్లి నోట బడకతప్పదు. లేక మర్కటకిశోరన్యాయముగా పురుషప్రయత్న మొనరింపుడు- ఇందుకు మితవ్యయముతో పలుసభలుగూర్చుడనియు అట్టిసద్బుద్ధి సర్వాంతర్యామియగు ఈశ్వరుడు మన కొసంగుగాక యని ప్రార్థించుచున్నాను-

---

## —• నాగరబ్రాహ్మణులు పతితులైనవిధము •—

వ॥ అని విశ్వామిత్రుండు వాక్రుచ్చుటయు నానర్తమహీవల్లభుం డిట్లనియె.

ఆ॥ "ధర్త్రయజ్ఞచేతఁ బలుమంది బ్రాహ్మణుల్ శ్రాద్ధయజ్ఞముల నిషిద్ధులైరి-
విబుధవరులు వేదవేదాంగపారగుల్ తీర్థజులును నన్యదేశజులును- ౨౫౧

సీ॥ ముకుచెవులొక్కదలైన ముఖ్యావయవముల హైన్యంబుగలిగిన యట్టివారుఁ
గాళ్ళో వ్రేళ్ళో యధికంబయియుంటచే నతివికారశరీరు లైనవారు
వర్ణాశ్రమాచారవర్తన ల్విడనాడి శాస్త్రపద్ధతిద్రొక్కఁ గోరువారు
నో కన్నివంకర లున్నవో యెఱుఁగక యగ్గలంబును మూర్ఖులైనవారుఁ
గునఖులైనవారుఁ గుష్ఠామయమువారు శ్రాద్ధయోగ్యులనుచుఁ జాఁటిచెప్పి
మంచిమంచివారి మర్యాదపోవ ననర్హులనఁగ నేటిన్యాయమయ్య ?" ౨౫౨

క॥ అని యిట్లడుగుటయు విశ్వామిత్రమహర్షి ౨౫౩

ఆ॥ "కలవు కారణములు కావలసినయన్ని- వినుము చెప్పెదను సవిస్తరముగ-
మహీసురాంగనలు చమత్కారభూనాథుపడఁతి దానములను బతితలైరి- ౨౫౪

చం॥ మగలు ప్రవాసమేగుతఱి మంచిగవచ్చి మహీశుభార్య మేల్
నగల నొసంగఁ దీసికొని వారు తదంగన- లా కతంబునన్
మిగులఁ బృథక్త్వమేర్పడియె మీఁదను లోపలఁగూడవారి- క
ట్లాగిని దదన్వయస్థుల కయోగ్యతయేర్పడె శ్రాద్ధపుంగ్రియన్- ౨౫౫

క॥ పదపడి విద్యాధనముల మదయుతులై తన్నుఁజూచి మాటాడమి బి
ట్టుదయుండై దుర్వాసుఁడు ముదమేద శపించి పతితముఖ్యులఁజేసెన్- ౨౫౬

తే॥ కుశుఁడురాజ్యంబు సేయుచోఁ గూళలైన రక్కసులువచ్చి భయపెట్టనొక్కమొగిని
బ్రజలు భీతిని మన్నినిపాలికరిగి చెప్పుకొనిరి మహీశ! తచ్చేష్టితంబు- ౨౫౭

చం॥ అతఁడు విభీషణున్ గుఱిచి యంపెను లంకకు వార్తయంత- నా
దితిసుతుఁ డయ్యుదంతమును దెచ్చినదూతకు జోతవెట్టి త
త్ప్రతయగు జానకీపతి పవిత్రచరిత్ర స్మరించుకొంచు శో
ధిత తదనిష్టకారుఁడయి దిక్కులఁ బాఱఁగఁదోలె వారలన్- ౨౫౮

ఆ॥ కరముభీతిఁజెంది గంధర్వలోకంబుఁ జేరి రసురు లంతఁ- జేరికూడ
రావణానుజన్ము రాపిడిపడలేక మనుజలోకమునకుఁ జనిరి పిదప- ౨౫౯

చం॥ కుశధరణీశుదాడి నటుఁగూడ వసింపఁగలేక యెంతయున్
గృశులయి బ్రాహ్మణాకృతులఁ బృథ్విఁ జరించిరి- విప్రసత్త్రచే
వశపడదయ్యె నుండుటకు వారలలోన- ననంతరంబు వా

రతివిహీనులౌచు భృశ మయ్యయిచోటుల కేగి యేగియున్ ౨౬౦

కం॥ పతితులరున్ సంస్థానము తతము చమత్కారపురము దర్శించి యటున్
కృతవసతులైరి రక్షస్సతి తత్రిత్యులనుచు ధాత్రీరమణా! ౨౬౧

కం॥ మాయావిశారదులయిన యాయసురులు విద్యచేత నర్థముచేతన్
బోయి సగ మాక్రమించిరి రాయుర్వీపాల! యాపురోత్తమ మోజన్- ౨౬౨

శా॥ నాటంగోలెను నాగరద్విజులు భూనాథా! నిలింపాహితే
ట్కోటిన్ దాటిరి మాటిమాటికి నెవో క్రూరక్రియత్నేరయు- చె
ప్పాటన్ వారిక నర్హులౌదు రతనీబర్హిర్ముఖుల్వెట్టు స
చ్ఛాటీదానముఖప్రశంసితములౌ శ్రాద్ధంబులం గొల్వఁగన్- ౨౬౩

ఆ॥ అట్లుగాన నరకమందునఁ బడఁద్రోయు వీరి శ్రాద్ధకృతుల విడువవలయు-
యత్నపూర్వకముగ నధ్వరంబులఁగూడఁ దగదు వీరిఁబిలిచి యొగిని గొలువ- ౨౬౪

చం॥ మఱియొకదోషముం గలదు మానవనాయక! విను- ఘూషపా
ద్గరళ మడంచు హేతువున స్థాపితులైరి త్రిజాతు లప్పురీ
వరమున- నాఁటఁగోలెనది వాడఁబడె న్నగరాఖ్య- నెల్లనా
గరులుఁ ద్రిజాతులైరి- యటుగావున వారలు భర్తృయజ్ఞుచే ౨౬౫

ఉ॥ వర్జితులైరి శ్రాద్ధమున- వారి స్పృశించినవారె శుద్ధికిన్
మార్జనఁజేసికోవలయు- మాలనిమూలమునం బొసంగె నీ
దుర్జనతాప్రసక్తి సవధూర్వహులైనను నాగరాళి- కో
యార్జితభూరివైభవ! సమర్హులెటయ్యెద రట్టివారికన్ ?" ౨౬౬

వ॥ అని వక్కాణించుటయు నానర్తమహీవల్లభుండు వెండియునిట్లనియె-

కం॥ "ఈకారణమును దయతో వాకొనవలయును మునీంద్ర! వరగుణసాంద్రా!
నీకుఁ జరాచరరూపక లోకజ్ఞానంబులోన లోపములేమిన్" ౨౬౭

వ॥ అనియిట్లు పృచ్ఛఁజేయుటయు మఱియు నగ్గాధినూనుండు ౨౬౮

కం॥ "ఇక్కడవాక్రుచ్చెద నీ కొక్కపురావృత్తమును నృపోత్తమ! వినుమా-
మిక్కిలిగ భర్తృయజ్ఞన్యక్కృతులౌ విప్రులెవరొ యదియు వచింతున్- ౨౭౦

### * { విప్రవేషముతో నొక చండాలుఁడు చమత్కారపురిఁ బ్రవేశించుట. } *

తే॥ వర్ధమానపురంబున వఱలెనొకయంత్యజుఁడు మును కుంభకుఁడనెడి పేరఁ
గఠినచిత్తుండు నత్యంత కలుషకృత్తుఁ బిల్లికసులుగలాఁడును నల్లమొద్దు- ౨౭౧

తే॥ కొంతకాలమునకు వాఁడు కొడుకుఁగనుడు వాఁడుమాత్రము కడురూపవంతుఁడయ్యె
నఖిలలక్షణలక్షితుం డఖిలకార్యదక్షుఁడుం గూడ నై శుక్లపక్షచంద్రు ౨౭౨
తే॥ అనుకరించుచుఁ బెంపొందు నతని చక్కదనము నగ్గింపఁజొచ్చె భూజనము కరము-
బుద్ధిఁదెలిసి కుటుంబంపు శుద్ధిఁగనుడు నాత్మను విరక్తియుదయించె నతని కకట!
తే॥ అంతఁ జింతావృతస్వాంతుఁడగుచునతఁడు దేశదేశంబులకుఁబోయి తిరిగితిరిగి
కష్టసురాకృతితోఁ జమత్కారపురముఁ జేరి ముప్పూట స్నానము సేసికొనుచు
సీ॥ ఛాందోగ్యుఁడను పేరి సన్మానిగోత్రమం దత్యంతమగు ఖ్యాతినందినట్టిఁ
డేపొద్దుఁజూచిన వేదియోవత్రిమును బొనరించుచుండెడి పూతచరితుఁ
డఖిలవేదములఁ దదంగంబులును బేర్మిఁ గొనవెళ్ళఁజదివిన కోవిదుండు
ప్రతివర్షమునను వైభవసమేతంబుగా యాగంబుఁ జేసెడి రాగరహితుఁ
డగు సుభద్రాఖ్యుఁ డవ్వీటు నలరుచుండ మాధుకరవృత్తికొనుచుఁ దన్మందిరంబు
"భవతి భిక్షాం దదా" తని సవినయముగఁ జని ప్రవేశించె- నింక నేమనివచింతు-
తే॥ తత్సుభద్రాఖ్య నాగరధారుణీసురునకు నొకకూఁతు- రది మూడుచనులుఁగలది-
పంటిపైఁ బల్లు మఱి పృష్ఠభాగమందు సుడియొకండును నుండెఁ దత్సుతకు క్షితిప!
ఉ॥ పుట్టుదరిద్రుఁడుం గులముపోయినవాఁడు విపత్తులోన ను
న్నట్టిఁడుగూడఁ జచ్చెదనటన్న భయంబునఁ దండ్రివచ్చి "యీ
పట్టిని నీకొసంగెదను, బాణిగ్రహింపు" మటంచు దండముల్
పెట్టి కరంబు వేడినను బెండిలిసేసికొనం డిఁకేమనన్- ౨౭౭
కం॥ దేనిపలువరుస యిమ్మడిగానుండునొ యాఱునెలలు గడియకమును పే
దానిపతి భుతశరీరుండౌనని సాముద్రికవిదులందురు ధరణిన్- ౨౭౮
తే॥ మూఁడుపాలిండ్లుగలిగిన యాఁడుపడుచు మామవంగసమంతయు మాయఁజేయు-
లేదు సందేహ మిద్దాన లేశమేని- గాన దూరంబునను వీడనౌను దాని- ౨౭౯
తే॥ పృష్ఠమందున సుడిగలపిల్ల రయము కులటయై పాపముం జాలఁ గూడఁబెట్టు-
నట్లుగావున భూపాల! యట్టికన్యఁ బరిహరింపంగవలయు సత్పురుషులెపుడు-
కం॥ అంతనది దినదినంబున కింతింత పెరుంగుటయును నీక్షించి కడున్
జింతించి యాసుభద్రుఁడు శాంతిం గనలేకపోయె! స్వాంతములోనన్- ౨౮౧
తే॥ "ఏమిసేయుదు- నేనింక నెటకుఁజనుదు- నెట్లు దీనికి మగఁడింక నేలుపడును-
మాటిమాటికి సంప్రార్థ్యమానులయ్యు దీనబధిరాంధపంగులున్ దీనిఁగొనరు- ౨౮౨
తే॥ ఎనిమిదేండ్లది గౌరిషా నెన్నఁబడెడి- నగును రోహిణి తొమ్మిదియబ్దములది-
దశశరత్ప్రాయ కన్య- యంతకునుమించినది రజస్వల- స్మృతి కారు లందురిట్లు-
శ్లో॥ "మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవచ
త్రయ స్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం. ౨౮౪

చం॥ అనియిటు ధర్మశాస్త్రముల సార్యులవాసి” రటంచు నెంతయున్
మనమునఁ జింతసేయ నెడ మాధుకరార్థము తన్నిపాదుఁ డా
తనియిలు సేరవచ్చుటయుఁ దద్రమణీయతఁ గాంచి బ్రాహ్మణుం
డని మది నిశ్చయించుకొని యబ్బురమంది సుభద్రుఁ డిట్లనున్- ౨౮౫
ఉ॥ “ఎచ్చటినుండివచ్చితివి ? యెచ్చటికేగుచునుంటి వియ్యెడన్ ?
ముచ్చటయయ్యె నిన్నుఁగన ముద్దులుగారెడి మోమువాఁడవై
బిచ్చము పెట్టుమంచు నిటు పేదవిధంబున నడ్డెదేల ? నీ
యచ్చపుగోత్రమేది ? చెప్పుమయ్య భవత్పితరాభిధానమున్” ౨౮౬
చం॥ అనవుడు వాఁడు “గౌడవిషయంబున భోజకటాభిధానమై
తనరెడి మామకీనమగు స్థాన- మటం బలుమంది బ్రాహ్మణుల్
మనుదురు- వారిలోపలను మాధవనామక వేదపారగుం
డనఘుఁడు నాదుతండ్రి- యతఁ డార్య ! వసిష్ఠసగోత్రుఁడయ్యెడిన్- ౨౮౭
ఆ॥ ఎంతయును సునుండు- నేకపరివరసూచితుఁడు- మదీయనామ మడిగెదేని
తన్మనురాగ్రగణ్య ! చంద్రప్రభుండందు- రష్టమాబ్దమునన యయ్యె వడుగు-
కం॥ వడివడి వడుగుం బొనరిచి మడిసెను నాజనకుఁ- డంత మాయమ్మయుఁ దాఁ
బడియెం దచ్చితిపై నన్నడవులపాల్సేసి- యేమియడిగెద వింకన్- ౨౮౯
ఉ॥ అంత విరక్తిగల్గుటయు నయ్యయితీర్థములందుఁ గ్రుంకుచు చ
త్యంతము సంచరించి యిటు కాఁగతుఁడైతిఁ- బ్రభాసతీర్థ మీ
ప్రాంతమునం జెలంగునఁట- యచ్చటికేగెద నేఁడొ రేపొ- నా
కింతకుమించుకర్జ మిఁక నెయ్యది గానఁగరాదు చూచినన్- ౨౯౦
చం॥ చదువఁగలేదు వేదములు- శాస్త్రము లంతకుమున్నె సున్న- య
య్యదియకతంబుగా నిటుల యాత్రలు సేయుచు భిక్షుకుండనై
బ్రదుకుచునున్నవాఁడ- నెదొ పద్ధతిదొక్కక కూరుచుండినన్
జదువును సంధ్య లేని పశుసన్నిభు నెవ్వఁడు గౌరవించెడిన్ ?” ౨౯౧

—♦ సుభద్రుఁడను బ్రాహ్మణుఁడు చండాలునకుఁ దనబిడ్డనిచ్చుట ♦—

చం॥ అనవిని యా సుభద్రుఁడు ప్రహర్షముఁ జెంది “సుదేశసంభవుం-
డనుపమసుందరాకృతియు- నందును బ్రాహ్మణుఁ- డట్లుగాన నీ
తనికి మదీయకన్యకను దప్పకయిత్తుఁ బ్రతిగ్రహించుచో-
ననఘుకులంబు పుష్పవతియై యది దూష్యము సేయులోపలన్” ౨౯౨
ఉ॥ అనిచింతించి ద్వితీయకుం దెలిపి యాయంత్యోద్భవుంగూర్చి “నా
తనయన్ నీకు గ్రహించుచో నొసఁగ సిద్ధంబున్నవాఁడన్ ద్విజా !

నిను నీపెండ్లమును నింటనుంచుకొనుచున్ నిత్యంబుఁ బోషింతు నే"
నని వాఁడిచ్చి యతండు సంతసిలి బిట్టుద్దాని కిష్టంపడన్ ౨౯౩

సీ॥ వేయినూటపదాఱు వివిధమౌ నాణెముల్ కనకంపుఁదళియలోఁ గాన్క వెట్టి
వ్రీహిగోధుమముఖ్య విశ్రుతధాన్యముల్ కొలిపించి లలిని గాదెలకు నింపి
యత్యున్నతంబైన హర్మ్యంబునొకదానిఁ గాఁపురంబుంటకుఁగాను జూపి
యేఁటేఁటనుం దప్ప కేటినీట ఫలించు పల్లంపుభూమి నర్పణముచేసి
మంచియావులమందఁ దోలించి యింటికపుడు గృహోక్త విధమున నాత్మజాత
నంత్యజునకిచ్చి యుద్వాహమాచరించి తనుఁ గృతార్థునిగా నెంచుకొనియె ద్విజుఁడు-

సీ॥ తీరుతీరగుపండ్లు తెప్పించుకొనితించు బలుపిండివంటలు సలుపుకొనుచు
ఫలరసంబులు నప్పుపట్టిన తేనియల్ గోక్షీరములు దధి గ్రోలుకొనుచు
శాల్జోళ్ళుగప్పుచు సకిఁగూడియొప్పుచు గడెకొక్క తీర్చుట్టు గట్టుకొనుచు
సిగఁ బూలుచుట్టుచు శ్రీగంధమలఁదుచు మెయినిండఁ గ్రొన్నగల్ పెట్టుకొనుచుఁ
దత్సుభద్రాఖ్యనాగరధరణిసురుని పట్టిఁ బెండ్లాడుపిదప నాపంచముండు
కడువిలాసంబుగా నుండఁగడఁగెఁగాని యొకవిశేషంబు వానిని బ్రికటపఱచె-

కం॥ అతఁడేగుదారి వెంబడి జతజతలై కుక్క లఱవసాగను- మఱియున్
శ్రుతిపాఠముసలిపెడిచో నతులితముగఁ బడియె రక్త మాస్యము వెంటన్- ౨౯౬

చం॥ అదిగనిసంశయించి ప్రజ "యంత్యజుఁడీతఁ" డటంచుఁ జెప్పఁగో
మొదలిడఁ దత్సుభద్రుఁ చెవి ముల్కులువోలెఁ బడెం దదుక్తు- ల
య్యదనునఁ బెద్దపెద్దలకటా! యని యయ్యపవాదపోకకై
యెదొయొక నిష్కృతింజలుప నెంతయు యోజనచేసి యంతటన్ ౨౯౭

కం॥ చని బ్రహ్మస్థానమునకు జనునొక్కనిఁబంపి యల్ల చండాలుని జ
య్యనఁ బిలిపించుడు వానికి ఘనభయమున మొగమునందుఁ గళ లోపించెన్- ౨౯౮

తే॥ మధ్యగునిద్వారమున నంత మహీసురవ్య లతని కులమును స్థలమును నడుగుటయును
గడగడవడంకి గద్గదకంఠుఁడగుచుఁ బట్టిదోసిలి మెలమెల్ల నిట్టులనియె- ౨౯౯

చం॥ "ఎనిమిదియేండ్లవాఁడనయి యే మన నా తలిదండ్రు లిర్వురున్
దనువును బాసిపోయిరి. పదంపడి తద్వ్యథతోడ లేచి స
న్మనితతివెంటఁ దీర్థముల మున్గుచుఁ గ్రుమ్మఱుచుండ మీపురం
బునను సుభద్రుఁడన్ ద్విజుఁడు పుత్రికనిచ్చి సమాదరించె నన్- ౩౦౦

కం॥ ఏకప్రవరుఁడ. భువనప్రాకటవాసిష్ఠగోత్రభవుఁడ. వినుఁడు సు
శ్లోకులు! గౌడాభిధమౌ శ్రీకరదేశమున మధుపురిన్ మనువాఁడన్" ౩౦౧

క॥ అని యిటువక్కాణించుడు విని "నీదుకోలంబు మాటు విచికిత్స్యంబై
కనుపట్టెఁగాన ఘటశోధనముం గావించి తెలుపఁదగు నద్దానిన్. ౩౦౨

తే॥ అట్లుగావున ఘటమెక్కి యద్దుచెప్ప, కిట్టివిధంబున సంశుద్ధి సెవనీ యవల
నఖిలభోగంబు లిచటన యనుభవింపు"మని ద్విజాతులు పలుకుడు నతఁడు మఱియు

తే॥ "మూసలోఁ గ్రాఁగు బంగారమును గ్రసింతు, దూఁకుదును మండునిప్పులందొ త్రుపడక
విసము నేనియు భక్షింతు విప్రులార! యింక ఘటశోధనము సేయ నేమిలెక్క. ౩౦౪

క॥ ఉండిన నా బ్రాహ్మణ్యము పండితసభ నిలుపుకొనఁగ భయమేమి? ద్విజుల్!
రండు ఘటశోధనము మీదండన సుఖముగ నొనర్తు దయఁగన కోడలిన్." ౩౦౫

క॥ అని సాహసమొనరించుడుఁ గని రవివాసరమునందు ఘటశోధనమున్
బని నిర్దేశించి వెసం జని రిండ్లకు భూమిసురులు. చని మాదిగయున్. ౩౦౬

మ॥ చనివాఁడంతట భార్యతోడను రహస్యస్థానముం జేరి "యో
వనబోఁడీ! నను మాలఁడంచుఁ గనుగొన్నారీపురీబ్రాహ్మణుల్
మననీరింకిట. నట్లుగాన నిపుడే మాయూరికిం బోద. మీ
వనుమానింపక లెమ్ము" నాఁగ విని యాయజ్ఞాత్మ కోపంబునన్. ౩౦౭

క॥ "నరకాగ్నిఁ గూలుకంటెను దురితాత్మా! యగ్నిలోన దూఁకుట మేలౌ.
నెఱిఁగియు మాలనివెంబడి యరుదెంతునె యింకఁగూడ నడుగులనొత్తన్. ౩౦౮

శా॥ ఏతత్స్థానమునంతయుం జెఱిచితీ. వింకన్ శరద్వ్యాజిమై
ఖ్యాతిం గాంచిన తాతపాదునిలు దూష్యంబొనటుల్సేసి. తీ
హేతుద్వంద్వముచేత నెవ్వఁడును దానీక్షింపకుండంగ నే
పో. తిర్యాత విపత్సముద్రమున నిన్ ముంపంగలారందఱున్. ౩౦౯

— చండాలస్పృష్టాంగులకుఁ బ్రాయశ్చిత్తము. —

చం॥ అయియిటు లుచ్చరించుటయు నప్పురవాసులు గాఢనిద్రలో
మను నెడ గోడి పెట్టుకొని మాలఁడు చచ్చితి రాయటంచు భీ
తిని జనె నిష్టహాళడకుఁ. దీక్ష్ణకరుం డుదయాద్రినెక్కఁ జోఁ
గనుగొని దీక్షితాత్మభవ కన్నుల నశ్రుకణంబు లుర్లఁగన్. ౩౧౦

ఉ॥ ఏడుచుకొంచుఁ దండ్రికడకేగి "పితా! యిదియేమిపాప? మె
వ్వాఁడొ మహీసురుండనని వచ్చినయంతన నన్నొసంగి, త
వ్వాఁడిపు "డంత్యజుండ" నని వాకొని నా కెటొ పోయెఁ. గాన నీ
నాఁడె ప్రదీప్తపావకమునంబడి వీడెద నేను బ్రాణముల్" ౩౧౧

చం॥ అనవిని దీక్షితుండయిన యల్ల సుభద్రుఁడు వాతధూతమా
ఘనతరువట్లు చేష్టలుడుగన్ మహిపైఁబడి శీతవారిసే
చనమునఁ గొంతసేపటికి సంజ్ఞనుబొంది సబాంధవంబుగ
న్మొనరుచుచున్ విలాపములు మూర్ధము మోఁదుకొనెన్ మహీపతీ! ౩౧౨

తే॥ అంత సంపర్కదూషితులైనయట్టి యెల్లపాలును నచ్చోటి కేగుదెంచి
యాసుభద్రుని నాతని యాత్మజాతఁ గొంచుఁ దద్భర్తృయజ్ఞుని పంచకరిగి- ౩౧౩

పృథ్వి॥ "సుభద్రుఁ డవిచారతన్ సుతనొసంగి చంద్రప్రభున్
సభార్యకముగా రహిన్ స్వగృహమందుఁ బోషించినాఁ
డభాజనుఁడు నంత్యజుం డనుచు వాఁ డెఱుంగంబడెన్
విభావరినిలేచితా వెడలిపోయె నెచ్చోటికో. ౩౧౪

తే॥ సార్ధసంవత్సరంబు నంత్యజుండు దైవపితృకార్యములలోనఁ దర్పితుండు.
తెలిసికొనఁడయ్యె నెవఁడు నీకలుషమతిని. ప్రకటమయ్యెను నేఁటికిఁబంచముఁడుగ-

తే॥ అగమయ్యెను నీస్థాన మంతయును సుభద్రుసంబంధమునఁ జేసి భర్తృయజ్ఞ!
నీవె దక్షుఁడ విద్దాని నిగ్రహింప. నేమిచేసెదవో చేయుఁ. మేల తడవు? ౩౧౬

కం॥ కొందఱు భుజియించిరి తన్మందిరమున. నింకఁ గొంతమందియు నుదకం
బుం ద్రావిరి. మఱికొందఱు విందొనరిచి రతనిఁబిలిచి వేశ్మంబులలోన్- ౩౧౭

కం॥ తత్పాపసంభవంబగు నుత్పాతము వాతఁబడకయుండినవాఁ డే
తత్పురమునఁ గనఁబడఁ. డో సత్పురుషా! యేల పెక్కుసంభాషణముల్- ౩౧౮

కం॥ నీవే పుణ్యస్థానముఁ గావించితి మున్ను దీనిఁ గరుణాళూ! మా
కీ వందఱకును గురుఁడవు. కావున శుద్ధులనొనర్చి కావఁగవలయున్" ౩౧౯

కం॥ అని మొఱపెట్టుటయును దద్ఘనుఁడు శ్రుతిశాస్త్రములును గలయవెదకి వా
కొనియెం బ్రాయశ్చిత్తము జననాథా! బ్రాహ్మణులకు సముచితభంగిన్- ౩౨౦

సీ॥ చాంద్రాయణంబును శతముపర్యాయము ల్విహితమతిం దాఁ జరియించుటొకటి
తనయింటిలోపలఁ దనరారునటువంటి యఖిలభాండంబుల త్యాగమొకటి
ఆదిఁ దాఁజేసిన యాధానమును వెండి విధ్యుక్తముగను గావించుటొకటి
లక్షహోమవిధానదీక్షావిచక్షణుండయి నూత్నదీప్తితో నలరుటొకటి
భర్తృయజ్ఞుఁ డర్హభంగిఁ బ్రాయశ్చిత్త మాసుభద్రకునకు నానతిచ్చి
యతనియాత్మజాత కగ్నిప్రవేశంబు తప్పదనుచుఁ జాఁటి చెప్పెనకట! ౩౨౧

ఆ॥ ఎవ్వరెన్నిసారు లేగి సుభద్రునియింటఁ గుడిచి తృప్తినెనసినారొ
యన్నికృచ్ఛ్రములను నాచరించుకొనుం డటంచుఁ జెప్పె వారి కందఱికిని- ౩౨౨

ఆ॥ అట్టులెన్నిమాఱు లాతనిలోఁగిఁట సలిలపానమెవరు సలిపియుండి
రన్నిపరులు వారి నరిగి ప్రాజాపత్యమును బొనర్చుకొనఁగ మొదలయిడియె- ౩౨౩

సీ॥ తత్స్థానగతులకుం దత్స్పృష్టులకును నొక్కొక్క ప్రాజాపత్య మొంగి విధించి
చెప్పి తదర్ధంబు స్త్రీశూద్రులకుఁ దదర్ధము బాలవృద్ధుల కమరఁజెప్పి
మెంగిని బ్రహ్మస్థానమునఁ గోటిహోమంబు స్థానసంశుద్ధికై సలుపఁబనిచి
రసజాతియంతయు వెస వీడనిశుమించి పాఱవేయించి మృత్పాత్రములను
హస్త మైత్రిమీఁది కఖిలనాగరులను బేరెలుంగు తోడఁ బిలిచిపిలిచి
భర్తృయజ్ఞుఁడపుడు "బ్రాహ్మణులార! వినుఁ" డంచు నింకనొక్క మాట యిట్లులనియె
సీ॥ తనయింటఁగల యెల్లధనసంచయంబును లక్షగాయత్రియు దీక్షితుఁడును
నర్ధచతుర్థాంశ మంత గాయత్రియు నతనియింటభుజించినట్టివారు
అష్టభాగధనంబు నంత తన్మంత్రము దద్గృహంబున నీరుద్రావినట్టి
రాత్మశక్తికొలంది నయ్యుభయంబును దుశ్శ్వపచస్పర్శదూషితులును
ఆత్మసురుల కొసంగి జపియించుచో శుద్ధియగును. వినుఁడు మఱియు నందఱకును
దప్పకుండ గోప్రదానంబు కార్యంబు స్పర్శదోష మెల్ల సమసిపోవ- ౩౨౫
కం॥ నేనును బ్రాణాయామము లూని శతత్రయము నిత్య మొనరుచుకొనుచున్
మానెద దివాశనం బిటుపైనన్ శుద్ధుండనగుదు నబ్దంబునకున్" ౩౨౬
ఆ॥ అని యిటు ల్వచించి యాభర్తృయజ్ఞుండు మధ్యగాస్యమునను మరలఁబిలిచి
యాద్యులైనయట్టి యల్ల బ్రహ్మస్థాన మొనసియుండు ద్విజుల కిట్టులనియె- ౩౨౭
కం॥ "ఏతద్దివసంబాదిగ ఖ్యాతుండగు నాగరునకె కన్యనిడనా.
నీతి రెఱుఁగక యిచ్చినయాతనిఁ బతితునిగ నెన్నవగు ద్విజులారా! ౩౨౮
ఉ॥ ఎవ్వఁడు నాగరేతరుని నింటికిఁ దోడ్కొనిపోయి శ్రాద్ధమం
దవ్వసుధామరోత్తముని యర్చితుఁజేయునొ తత్పితృవ్రజం
బవ్వడి దేవయుక్తముగ నావలకుం జను. నాగరున్ వినా
యెవ్విధిఁజేయఁగాబడియు నీపయి శ్రాద్ధము వ్యర్థమయ్యెడిన్- ౩౨౯
కం॥ యాగముల సోమపానము బాగుగనే యాచరింపఁబడుఁగాక మహిన్
నాగరుఁడు లేనిచో నది వేగ సురాపానమగును వినుఁడు ద్విజాతుల్! ౩౩౦
తే॥ శుద్ధిలేనట్టినాగరు శ్రాద్ధమందుఁ గుడువఁబెట్టినచో నదిగూడ వ్యర్థ
మెల్లనాగరజనులకు నెడఁదనరసి యేరుపఱచితి మర్యాద యిట్లు నేను- ౩౩౧
కం॥ కాన నిజస్థానంబును బూని విశుద్ధంబు సేయుపొంటె ద్విజన్మల్
మానక శుద్ధిం బొనరుచుకోనా "నేఁటేఁట" యనుచుఁ గ్రొత్తగ నిటులన్- ౩౩౨
తే॥ భర్తృయజ్ఞుండు నాగరబ్రాహ్మణాళి కొక్క మర్యాదగావించె నోయిలేశ!
తావకంబైన ప్రశ్నకుఁ దగినయుత్తరంబువచ్చెను. దదనంతరంబ మఱియు- ౩౩౩

౮ బేలూరి రామన్న గుప్తగారు, సదాశివుని పేట

౯ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.

౧౦ రాచూరి సుబ్బయ్యగారు - (శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి)

౧౧ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౨ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం

౧౩ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౪ కామమాను హనుమయ్యగారు, నర్సారావుపేట

౧౫ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౬ భాస్కరరాయని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౭ నరసింహస్వామివారు, యాదగిరి

౧౮ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౯ జూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు

౨౦ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨౧ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, క్లీడరుగుమాస్తా, గురిజాల.

౨౨ వెలిదెండ్ల సత్యనారాయణగారు - కరణం, చింతిరాల.

౨౩ కవులూరి నరసింహారావుగారు, రివిన్యూయినస్పెక్టరు - పిడుగురాళ్ళ

౨౪ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబినస్పెక్టరు, ప్రత్తిపాడు

౨౫ రాచకొండ వెంకటరామయ్యగారు, యెనమదల

౨౬ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబినస్పెక్టరు - బొల్లాపల్లి

౨౭ మండ చినవెంకయ్యగారు, దండమూడి.

౨౮ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.

౨౯ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౩౦ చక్కులం పాపయ్యగారు-ముసలాపురం

౩౧ తాళ్వెలిమె లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం

౩౨ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్లపల్లి

౩౩ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.

౩౪ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౩౫ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము

౩౬ కాకిరాల రామచంద్రయ్యగారు, మముదాపురము

౩౭ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు

౩౮ ఇటికాల రాజేశ్వరరావుగారు - వకీలు కంభంమెట్టు

౩౯ వెలమకన్ని శోభనాద్రిరావుగారు - శోభనాద్రిగూడెం.

౪౦ నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు - తమ్మవరం.

౪౧ తిరుమలనల్యాక్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - శాతాపురం.

౪౨ కొండంభట్లగారి వెంకన్నగారు. గుమ్మడిదల

# అభినవసరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది, యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కరిణీకోద్ధారిణి [పూరి వీరభద్రకవి] ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము ... | 0 | 3 | 0 |
| 11 | అస్పృశ్యతానివారణ ఖండనము (మల్లాది రామకృష్ణచయనులుగారు) | 0 | 8 | 0 |
| 12 | వత్సలనీతిశతకము ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | 0 | 3 | 0 |
| 15 | పశ్యాంపుశ్యాం ... | 0 | 2 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము ... | 0 | 10 | 0 |
| 22 | అభినవశాకుంతల నాటకము ... | 0 | 8 | 0 |
| 23 | సూతసంహిత-ఆంధ్రము ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |
| 27 | ధర్మనిర్ణయము. | 0 | 4 | 0 |
| 28 | భారతకథాతత్త్వనిర్ణయము (మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛయనులుగారు) | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరు జిల్లా